# వైకుంఠ ఏకాదశి

## (ముక్కోటి ఏకాదశి)






ధర్మప్రచార పరిషత్తు
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# వైకుంఠ ఏకాదశి
## (ముక్కోటి ఏకాదశి)




రచన

**విద్వాన్, డాక్టర్ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

**డాక్టర్ ఆకెళ్ల విభీషణశర్మ**

❊ ❊ ❊

ఏకాదశీసమం కించిత్ పావనం న చ విద్యతే ।
స్వర్గమోక్షప్రదా హ్యేష రాజ్యపుత్రప్రదాయినీ ॥

❊ ❊ ❊

ప్రచురణ

ధర్మప్రచారపరిషత్తు

తిరుమల తిరుపతి దేవస్థానములు

**తిరుపతి - 517 501**

# వైకుంఠ ఏకాదశి
(ముక్కోటి ఏకాదశి)

ప్రథమముద్రణ : 2,50,000

2006-జనవరి

**వెల : అమూల్యము**

**ప్రచురణ**
ధర్మప్రచారపరిషత్తు
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి-517501

**డి.టి.పి. & ముద్రణ**
స్టూడెంట్స్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
553, బాలాజి కాలని, తిరుపతి
ఫోన్ : 2260253

# ముందుమాట

"వేంకటేశ! పాహి మాం, వేంకటేశ! రక్ష మామ్"

తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మప్రచారపరిషత్తు ద్వారా ఎన్నో అమూల్యమైన పుస్తకాలు ముద్రించి, ఆస్తిక జిజ్ఞాసులోకానికి ఉచితంగా పుస్తకప్రసాదరూపంలో అందిస్తున్నది. ప్రజలమధ్య ఐకమత్యాన్నీ, సోదరత్వాన్నీ, ధార్మికచింతననూ, ఆధ్యాత్మికాసక్తినీ, భక్తితత్త్వాన్నీ పెంపొందించడంలో ధార్మికపుస్తకప్రచురణ, వితరణ ప్రముఖపాత్ర వహిస్తుంది.

శ్రీ పార్థివశ్రావణపూర్ణిమనాడు తి.తి.దే. కల్యాణ మండపాల్లో నిర్వహించిన 'శ్రీపద్మావతీ శ్రీనివాసకల్యాణ మహోత్సవాలు' భక్తుల్ని విశేషంగా ఆకర్షించాయి. అప్పుడు ప్రచురించి, పుస్తక ప్రసాదంగా అందించిన "శ్రావణపూర్ణిమ" పుస్తకం భక్తులకు ఎంతో ఉపకరించింది.

భారతీయులకు ఉన్నన్ని పండుగలు ఇతర దేశస్థులకు లేవు. ప్రతి పండుగలోనూ ఎన్నో ధార్మిక, ఆధ్యాత్మిక, వైజ్ఞానిక,

ఆరోగ్యాది విశేషాలు లీనమై వుంటాయి. వాటిల్ని గుర్తించి, ఆంతర్యాన్ని గ్రహించి, ఆయా పండుగలూ, వ్రతాలూ భక్తిశ్రద్ధల్తో ఆచరిస్తే ఐహికాముష్మికఫలాలు సిద్ధిస్తాయి.

'వైకుంఠ ఏకాదశి' (ముక్కోటి ఏకాదశి) అనే ఈ చిరు పుస్తకాన్ని – తిరుమలలో ఎంతో ఘనంగా జరిగే 'ముక్కోటి ఏకాదశి' పర్వదినోత్సవసందర్భంగా – భక్తులకు శ్రీవారి ప్రసాదంగా అందిస్తున్నాము. మస్తకాన్ని చైతన్యవంతం చేసే సాధనాల్లో పుస్తకం ప్రబలశక్తిమంతం.

ఏ కార్యమైనా తెలిసిచేయడం మంచిది. కనుక 'ముక్కోటి ఏకాదశి' అంటే ఏమిటో, ఎందుకు ఎలా ఈ 'ఏకాదశి'ని నిర్వహించాలో విజ్ఞులైన పెద్దలకు తెలిసే వుంటుంది. కాని సామాన్యులకు ఈ ప్రచురణద్వారా కొంత ప్రయోజనం సిద్ధిస్తుం దనే ఆశయంతో 'వైకుంఠ ఏకాదశి' వైశిష్ట్యాన్నిగూర్చి ఇందులో వివరించడం జరిగింది.

ఈ శుభాశయసిద్ధికి డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య. కార్యదర్శి, ధర్మప్రచారపరిషత్, డా॥ ఆకెళ్ల విభీషణశర్మ

తి.తి.దే. దృశ్యశ్రవణ ప్రాజెక్టు ఉద్యోగి, కృషిచేసి, పుస్తకాన్ని సంకలనం చేశారు. వీరికి ధన్యవాదాలు.

ఆస్తికలోకం ఈ పుస్తకప్రసాదాన్ని స్వీకరించి, భక్తిశ్రద్ధలతో పఠించి, 'వైకుంఠ ఏకాదశి' ప్రభావాన్ని గుర్తించి, శ్రీవారిసేవలో ధన్యులూ, కృతకృత్యులూ అవుతా రని ఆశిస్తూ...

సదా శ్రీవారిసేవలో

**ఏ.పి.వి.ఎన్. శర్మ,**

కార్యనిర్వహణాధికారి,

తి.తి.దేవస్థానములు.

తిరుపతి,

01-01-2006.

# వినయాంజలి

'కలౌ వేంకటనాయకః" – కలియుగ ప్రత్యక్షదైవం శ్రీ వేంకటాచలపతి. వేంకటాద్రితో సమానమైన క్షేత్రం, వేంకటేశ్వరునితో సమాన మైనదైవం విశ్వంలో "నభూతో న భవిష్యతి'. శ్రీవారిసేవయే కలిసంతరణమార్గం! స్వామి సన్నిధి – భక్తులపాలిటి పెన్నిధి.

నిత్యకల్యాణం పచ్చతోరణంగా వెల్గొందే తిరుమల క్షేత్రంలో శ్రీవారికి ఎన్నో ఉత్సవాలు, ఎంతో భక్తిశ్రద్ధలతో నిర్వహిస్తారు. ఏ ఉత్సవానికీ, ఏ పర్వదినంలోనూ లేని విశిష్టత వైకుంఠ ఏకాదశికి స్వామి వారి సన్నిధిలో సిద్ధించింది. వైకుంఠ ద్వారం ఒక రోజంతా తెరచివుంచే మహోత్సవం – వైకుంఠ ఏకాదశి. లక్షల సంఖ్యలో ఈ దివ్యద్వారప్రవేశం కోసం భక్తులు తరలివస్తారు. అదొక దివ్యానుభూతి! చిరస్మరణీయ సన్నివేశం! సంవత్సరానికి ఒకేవొక్కమారు లభించే మహా భాగ్యం – ముక్కోటి ఏకాదశినాటి శ్రీవారిసేవ! మరునాటి ద్వాదశి పుష్కరిణీచక్రస్నానం అనేకకోట్ల జన్మల పుణ్యఫలం.

తిరుమల స్వామిపుష్కరిణిలో సంవత్సరంలో నాల్గుమార్లు చక్రస్నానం జరుగుతుంది. 1) అనంత పద్మనాభవ్రతం నాడు (భాద్రపద శుక్ల చతుర్దశి), 2) 10 రోజులు జరిగే బ్రహ్మోత్సవాల్లో చివరి రోజు. 3) వైకుంఠ ఏకాదశి మరునాటి ద్వాదశి రోజున, 4) రథసప్తమినాటి మధ్యాహ్నం. ఇందులో వైకుంఠ ఏకాదశి నాడు ముల్లోకాల్లో ఉన్న మూడు కోట్ల, యాభైలక్షల పుణ్యతీర్థాలు సూక్ష్మరూపంలో స్వామి పుష్కరిణిలో అవహిస్తాయి. సర్వదేవతలూ అందు సన్నిధి చేస్తారు. ఇంతటి మహత్తరప్రభావంగల ఈ వైకుంఠ ఏకాదశి, ద్వాదశి విశేషాలు సంగ్రహంగా ముద్రించి, భక్తులకు ప్రసాదంగా అందించాలన్న తి.తి. దేవస్థాన కార్యనిర్వహణాధికారి, గౌరవశ్రీ ఏ.పి.వి.ఎన్.శర్మగారి ఆశయాన్నీ, ఆదేశాన్నీ భగవదాజ్ఞగా శిరసావహించి, పెద్దల రచనలు ఆధారంగా ఈ చిన్న పుస్తకాన్ని సంతరించాము.

ఈ రచనలో ఆత్మీయ సోదరుడు డా॥ ఆకెళ్ల విభీషణశర్మ సహకారం గొప్పది. ఈ పుస్తక రచనలో తోడ్పడిన పెద్దలకూ, గ్రంథకర్తలకూ మా హార్దకృతజ్ఞతాంజలులు. ఈ రూపంలో

శ్రీవారిసేవాభాగ్యాన్ని కల్గించిన తి.తి.దే. ఉన్నతాధికారులకు వినయాంజలులు.

పాఠకలోకానికి ఆనందాంజలులు.

"దొరకునా ఇటువంటి సేవ"

శ్రీవారిధార్మికసేవలో
**పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**
కార్యదర్శి
ధర్మప్రచారపరిషత్
తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి,
01-01-2006.

## ఓం నమో వేంకటేశాయ

సర్వమూ కాలాధీనం. "కాలః కలయతా మహమ్" అని భగవద్గీత అనంతమైన కాలాన్ని భగవత్స్వరూపంగా నిరూపించింది. కాలము శ్రీమహావిష్ణువుయొక్క ఆజ్ఞతో ప్రవరిస్తూం దని పెద్దలు సూచించినారు. అనంత శక్తిమంతమైన కాలాన్ని సౌరం, చాంద్రం, సావనం, నాక్షత్రం - అని నాల్గు విధాలుగా సూచించి, గణించడం జరిగింది. దక్షిణాదిలో సౌరచాంద్రమానాలే గణనీయాలు. మనం చైత్ర వైశాఖాదిమాసాల్నీ, పాడ్యమి (ప్రతిపత్), విదియ (ద్వితీయ), తదియ (తృతీయ), చవితి (చతుర్థి), మున్నగు తిథుల్నీ, చాంద్రమానం ప్రకారం గణిస్తున్నాము. పున్నమనాడు చంద్రుడున్న నక్షత్రాన్నిబట్టి గణించేవి చైత్రాది మాసాలు. ఉదా॥ చిత్తా నక్షత్రములో పున్నమనాడు చంద్రు డుండటాన్ని లెక్కించి – చైత్రం అన్నారు. చంద్రుణ్ణి ఆధారంగా గణించే కాలమానం చాంద్రమానం. సూర్యుణ్ణి ఆధారంగా – సూర్యుడు ఒక్కొక్కరాశిలో ప్రవేశించి వుండే నెలరోజులకూ ఆయా మాసంగా ఉదా॥ మకరమాసం

ఇత్యాదిగా గణించడం సౌరమానం. (సూరః = సూర్యుడు, సరతి చరతీతి సూరః – అని వ్యుత్పత్తి. సంచరించువా డని అర్థం. సూరసంబంధమైనది సౌరం). సౌరమానం మాసాలు ఆయా ఇంగ్లీషు తేదీలను పోలినవై ఎక్కువ శాతం ఆయా తేదీల్లోనే వస్తాయి. కనుకనే తమిళులకు ఏప్రిల్ ఒకటవ తేదీయే మేషమాసారంభమై – సంవత్సరాది అవుతుంది. "రవేః సంక్రమణం రాశౌ సంక్రాంతి రితి కథ్యతే" అనుటచే ఒక్కొక్క మాసమూ ఒక్కొక్క సంక్రాంతి అవుతుంది. కాగా మకర సంక్రాంతి జనవరి 14 నుండి కర్కాటక సంక్రాంతి జూలై 16 వరకు ఉత్తరాయణం, జూలై 17 నుండి, జనవరి 13 వరకూ దక్షిణాయనం అంటున్నాము.

"అయనే దక్షిణే రాత్రి రుత్తరే తు దివా భవేత్" అని కపింజల సంహితావాక్యం. దక్షిణాయనం రాత్రి. ఉత్తరాయణం పగలు. మానవులకు ఒక సంవత్సర కాలమైనది దేవతలకు ఒక అహోరాత్రమైన దినం. సూర్యుడు ధనూరాశిలో ఉండే మాసం ధనుర్మాసం.

ఈ నెలలో ఉషఃకాలం చాలా ప్రాముఖ్యం! "ధను స్సంక్రాంతి మారభ్య మాస మేకం వ్రతం చరేత్" అనుటచే ధనుర్మాసం నెలరోజులూ శ్రీహరిని విధిగా బ్రాహ్మీకాలంలో అర్చించాలి. ఇలా అర్చిస్తే "కోదండస్థే సవితరి ప్రత్యూషః పూజయే ద్ధరిమ్ । సహస్రాబ్దార్చన ఫలం దినేనైకేన సిద్ధ్యతి" – ధనుర్మాసంలో ఒక్కరోజు ఉషఃకాలంలో శ్రీహరిని అర్చిస్తే – వెయ్యేండ్లు నిత్యమూ అర్చించిన ఫలం సిద్ధిస్తుంది. 30 రోజులూ అర్చించేవారికి 30 వేలేండ్లు అర్చించిన – అంటే అనంతఫలం లభిస్తుంది. అనంతుణ్ణి అనంతంగా అర్చిస్తే అనంతఫలమే కదా సిద్ధిస్తుంది!

ధనుర్మాసం సౌరమానానుసారం రాగా, శుక్లపక్ష ఏకాదశి చాంద్రమానమైన తిథి. ప్రతిమాసంలోనూ రెండు ఏకాదశులు (శుక్ల – బహుళ) వస్తాయి. (అధిక మాసంలో మరో రెండు అధికం). సంవత్సరానికి 24 ఏకాదశులు. ప్రతి ఏకాదశికూడ ఎంతో పవిత్రమైనది. "గృహస్థో బ్రహ్మచారీచ ఆహితాగ్ని స్తథైవచ । ఏకాదశ్యాం న భుంజీత

పక్షయో ఉభయోరపి" - బ్రహ్మచారి, గృహస్థుడు, నిత్యాగ్నిహోత్రుడూ ఎవడైనా కావచ్చు - ఉభయ ఏకాదశుల్లోనూ భోజనం చేయరాదని శాస్త్రవాక్యం! ఇంతనిష్ఠతో కూడుకున్న ఏకాదశీ దినం శ్రీ మహావిష్ణువుకు మిక్కిలి ప్రీతియైనది. కనుకనే ఏకాదశిని **"హరివాసరం"** అన్నారు పెద్దలు.

24 ఏకాదశుల్లోనూ - సౌరమానంలో ప్రశస్తమైన ధనుర్మాసంలో (మార్గశిర / పుష్యమాసాల్లో) వచ్చే శుక్లపక్ష ఏకాదశిని "వైకుంఠ ఏకాదశి"గా కీర్తిస్తున్నాము. దీన్నే "ముక్కోటి ఏకాదశి" అని ఆంధ్రు లంటారు. సౌరమానం ధనుర్మాసంకాగా, అందువచ్చే' వైకుంఠ ఏకాదశి' చాంద్రమానానుసారిణి. శ్రీమన్నారాయణునికి సూర్యుడు కుడికన్ను. చంద్రుడు ఎడమ కన్ను. కన్నులు వేర్వేరుగా నున్నా దృష్టి ఒక్కటేయైనట్లు, సూర్యచంద్రులు వేర్వేరుగా కన్పిస్తున్నా - కాంతితత్త్వం ఒక్కటే అనే మహాతత్త్వాన్ని ఈ పండుగ సూచిస్తూంది.

వైకుంఠ ఏకాదశి సామాన్యంగా మార్గశిర పుష్య మాసాల్లో వస్తుంది. రావణుని బాధలు తాళలేని దేవతలు బ్రహ్మను వెంటబెట్టుకొని వైకుంఠం చేరి, హరివాసరమైన మార్గశిర శుక్ల ఏకాదశినాడు శ్రీహరిని ప్రార్థించి, తమ బాధను విన్నవించారు. స్వామి బ్రహ్మాదులకు దర్శన మిచ్చి, అభయ మొసగడం జరిగింది. కాగా దేవతల బాధా నివారణానికి ఈ ఏకాదశియే మార్గం చూపింది. మరో వృత్తాంతం - మధుకైటభులను మహావిష్ణువు సంహరించినపుడు వారు దివ్యరూపాలు ధరించి, దివ్య జ్ఞానాన్ని పొంది, "దేవా! వైకుంఠంవంటి మందిరాన్ని నిర్మించి, ఏకాదశీపూజ గావించి, నిన్ను దర్శించి, నమస్కరించి, ఉత్తరద్వారమార్గంలో నిన్ను సమీపించే వారికి శ్రీవైకుంఠప్రాప్తి కల్గించు"మని ప్రార్థించారు. స్వామి "తథాస్తు" అని సంతోషంతో అనుగ్రహించారు. దీనికి "మోక్షోత్సవదిన' మనికూడా పేరు. ముక్కోటి దేవతలకు బాధలను నివారించిన ఏకాదశి కనుక "ముక్కోటి ఏకాదశి" అని పేరు. (ముక్కోటి అనేది 33 కోట్లకు సంకేత

మని అంటారు). వైకుంఠదర్శనం కల్గిస్తుంది కనుక "వైకుంఠ ఏకాదశి". భగవద్దర్శనం గావించేది కనుక "భగవదవలోకనదినం".

మార్గశిరమందలి శుక్ల ఏకాదశి – 'మోక్షదైకాదశి'. పుష్యశుక్ల ఏకాదశి – 'పుత్రదైకాదశి'.

సుకేతుడనే రాజు విశ్వేదేవతల ఉపదేశానుసారం పుష్యశుక్ల ఏకాదశీవ్రతాన్ని ఆచరించి, భగవదనుగ్రహం వల్ల పుత్రవంతుడైనా డని పద్మపురాణం పేర్కొనింది.

సకలపాపాలనుండి విముక్తి చెంది, శ్రీకైవల్యప్రాప్తితో జన్మరాహిత్యం చెందడానికి వైకుంఠ ఏకాదశీ వ్రతాన్ని మించిన వ్రతాచరణ లేదు.

దేవదానవులు ఈ యేకాదశిరోజు ఉపవాసంతో రాత్రింబవళ్లూ శ్రమించి, క్షీరసాగరాన్ని మథించగా, ద్వాదశినాడు మహాలక్ష్మి సముద్రంనుండి వెలువడి వచ్చి, దేవతలకు ప్రత్యక్షమై, వారిని అనుగ్రహించింది. నాటి నుండి ఏకాదశినాడు పగలూ, రాత్రి ఉపవాసంతో వుండి,

జాగరణ చేసి, శ్రీహరిని స్తుతించినవారికి స్వామికృపవల్ల ముక్తి కరతలామలకమవుతుందనే నమ్మకం ఏర్పడింది.

శుక్ల ఏకాదశినాడు సూర్యునినుండి వెలువడిన పదకొండవకళ చంద్రుణ్ణి ప్రవేశిస్తుంది. బహుళ ఏకాదశినాడు చంద్రమండలమునుండి పదకొండవ కళ సూర్యమండలాన్ని చేర్తుంది. ఇలా రాకపోకలవల్లనే "ఏకాదశి" అనే పేరు సార్థకమయింది. "ఏకాదశ్యా ముపవసే న్న కదాచి దతిక్రమేత్" – ఏకాదశినాడు తప్పక ఉపవాసం చేయాలి. ఉపవాసం నాడు "ఉపవాసః స విజ్ఞేయః, సర్వభోగవివర్జితః" – పాపకృత్యాలకు దూరంగా వుండి, (చేయక) సకలభోగాలను వదలి, పుణ్యకార్యాలు చేయడమే ఉపవాసం అని పెద్దలమాట! ఇంద్రియ ప్రకోపాన్ని అణచి, 11 ఇంద్రియాలను (పంచకర్మేంద్రియ పంచజ్ఞానేంద్రియ మనస్సులు 11 ఇంద్రియాలు) భగవంతుని సన్నిధిలో వసింపజేయునదియే నిజమైన ఉపవాసం. ఏకదాశీవ్రతం దశమిరాత్రితో ప్రారంభమై,

ద్వాదశిఉదయంతో పూర్తి అవుతుంది. అందరూ ఈ వ్రతాన్ని ఆచరించవచ్చు!

ఎన్మిదేండ్లలోపు వయస్సున్న పిల్లలూ, ఎనభైయేండ్లు దాటిన వృద్ధులూ ఉపవాసం చేయాల్సినపనిలే దని కాత్యాయనస్మృతి పేర్కొనింది.

24 ఏకాదశుల పేర్లూ, ఫలాలూ సంగ్రహంగా తెలుసుకొందాం.

1) చైత్రశుక్ల ఏకాదశి – 'కామదా' – కోర్కెలు తీరుస్తుంది.
2) చైత్రబహుళ ఏకాదశి – 'వరూధిని' – సహస్ర గోదాన ఫలం లభిస్తుంది.
3) వైశాఖశుద్ధ ఏకాదశి – 'మోహిని' – దరిద్రుడు ధనవంతు డగును.
4) వైశాఖ బహుళ ఏకాదశి – 'అపరా' – రాజ్యప్రాప్తి.
5) జ్యేష్ఠశుక్ల ఏకాదశి – 'నిర్జల' – ఆహార సమృద్ధి.

6) జ్యేష్ఠ బహుళ ఏకాదశి – 'యోగినీ' – పాపములను హరిస్తుంది.

7) ఆషాఢశుద్ధ ఏకాదశి – 'దేవశయనీ' – సంపత్ ప్రాప్తి (విష్ణువు యోగనిద్రకు శయనించు రోజు)

8) ఆషాఢబహుళ ఏకాదశి – 'కామికా' – కోరిన కోర్కెలు ఫలిస్తాయి.

9) శ్రావణశుక్ల ఏకాదశి – 'పుత్రదా' – సత్సంతాన ప్రాప్తి.

10) శ్రావణబహుళ ఏకాదశి – 'అజా' – రాజ్యపత్నీ పుత్ర ప్రాప్తి. ఆపన్నివారణం.

11) భాద్రపదశుద్ధ ఏకాదశి – 'పరివర్తన' – (యోగ నిద్రలో విష్ణువు ప్రక్కకు పొర్లును కనుక పరివర్తన) యోగసిద్ధి.

12) భాద్రపద బహుళ ఏకాదశి – 'ఇందిరా' – సంపదలు, రాజ్యము ప్రాప్తించును.

13) ఆశ్వయుజశుక్ల ఏకాదశి - 'పాపాంకుశ' - పుణ్యప్రదం.

14) ఆశ్వయుజ బహుళ ఏకాదశి - 'రమా' - స్వర్గప్రాప్తి.

15) కార్తికశుక్ల ఏకాదశి - 'ప్రబోధిని' - (యోగనిద్ర నొందిన మహావిష్ణువు మేల్కొనే రోజు) జ్ఞానసిద్ధి.

16) కార్తిక కృష్ణ ఏకాదశి - 'ఉత్పత్తి' - దుష్ట సంహారము. (మురాసురుని సంహరించిన కన్య విష్ణుశరీరము నుండి జనించిన రోజు)

17) మార్గశిరశుక్ల ఏకాదశి - 'మోక్షదా' - మోక్షప్రాప్తి. (ఇది వైకుంఠ ఏకాదశి)

18) మార్గశిర కృష్ణ ఏకాదశి-'విమలా' (సఫలా) - అజ్ఞాన నివృత్తి.

19) పుష్యశుక్ల ఏకాదశి - 'పుత్రదా' - పుత్రప్రాప్తి (ఇది వైకుంఠ ఏకాదశి)

20) పుష్య కృష్ణ ఏకాదశి – కల్యాణీ (షట్‌తిలా) ఈతిబాధా నివారణం.

21) మాఘశుక్ల ఏకాదశి – 'కామదా' (జయా) – శాపవిముక్తి.

22) మాఘకృష్ణ ఏకాదశి – 'విజయా' – సకలకార్య విజయం. (ఇది భీష్మైకాదశి అని ప్రసిద్ధి)

23) ఫాల్గున శుక్ల ఏకాదశి – 'ఆమలకీ' – ఆరోగ్యప్రదం.

24) ఫాల్గున కృష్ణ ఏకాదశి – 'సౌమ్యా' – పాపవిముక్తి.

(పురాణాలలో ఏకాదశులకున్న పేర్లవిషయంలో కొన్ని భేదాలు కన్పిస్తున్నాయి).

## ఏకాదశీ దేవీ జననము

పూర్వం కృతయుగంలో చంద్రావతీనగరాన్ని పాలించే 'మురు'డనే రాక్షసు డుండేవాడు. దేవతల్ని జయించి, వేధించేవాడు. విష్ణువు వానితో వెయ్యేండ్లు యుద్ధం చేసి, అలసి, విశ్రాంతికై ఒకగుహలో చేరి నిద్రించాడు. అట్టి

శ్రీహరిని సంహరించడానికి మురుడు సిద్ధపడగా, స్వామి శరీరంనుండి దివ్య తేజస్సులతో ఒక కన్య ఉద్భవించింది. దివ్యాస్త్రాలతో యుద్ధం చేసి, ఆ కన్య మురుణ్ణి సంహరించింది. విష్ణువు మేల్కొని కన్యనూ, మరణించి యున్న మురుణ్ణీ చూచి, ఆశ్చర్యపడినాడు. కన్య నమస్కరించి, జరిగిన దంతా విన్నవించింది. సంతోషించిన విష్ణువు ఆమెను వరం కోరుకొమ్మన్నాడు. ఆమె ఆనందంతో "దేవా! నేను ఏకాదశి నాడు నీ దేహం నుండి ఉద్భవించాను. కనుక నాపేరు ఏకాదశి. నా వ్రతం చేస్తూ, ఈనాడు ఉపవాసం వుండేవారు సంసార బంధాల నుంచీ తరించేట్లుగా వర మిచ్చి, అనుగ్రహించండి" అని ప్రార్థించింది. స్వామి "అట్లే అగుగాక!" అని వర మిచ్చి, అదృశ్యుడైనాడు. నాటినుండి ఏకాదశీవ్రతం భక్తితో ఆచరించేవారు సకలపాపాలనుండి విముక్తులై, విష్ణు లోకాన్ని పొందుతా రన్న ప్రశస్తి ఏర్పడింది.

ఏకాదశీ తిథికి అధిదేవత ఏకాదశీదేవి. ఈమె విష్ణు దేహసముత్పన్న కనుక స్త్రీమూర్తియైన మహావిష్ణువే! "జన్య జనకంబులకు భేదశంక లేదు" కదా! సర్వోత్తమ తిథి - ఏకాదశి. ఏకాదశీవ్రతప్రభావాన్ని వివరించే కథలు చాలా వున్నాయి.

కుచేలుడు ఏకాదశీవ్రతాన్ని ఆచరించి, మహైశ్వర్యవంతు డైనా డని ఐతిహ్యం. ధర్మరాజు ఆచరించి కష్టాలనుండి గట్టెక్కినాడు. రుక్మాంగదుడు ఆచరించి పుత్రప్రాప్తి నొందాడు. సకల దేవతా కృపా పాత్రు డైనాడు. మోక్షగామియైనాడు. క్షీరసాగరమథనం - లక్ష్మి ఆవిర్భావం ఏకాదశినాడే జరిగాయి. వైఖానస రాజు ఆచరించి, పితరులకు ఉత్తమలోకప్రాప్తి చేకూర్చాడు. అంబరీషుని వ్రత ప్రభావం జగద్విదితం!

## ఆధ్యాత్మిక స్ఫూర్తి

వ్రతాలూ, పూజలూ అన్నీ ఇంద్రియనిగ్రహంతో భగవత్ కైంకర్యపరులై, జ్ఞానవిజ్ఞాన ఘనులై ముక్తులగుట

కొరకే ఏర్పడిన విశిష్టసాధనాలు. ఆధ్యాత్మికతత్త్వం అంతర్లీనం కాకుండా భారతీయుల కర్మకాండ సిద్ధింపదు. సర్వకర్మలూ జ్ఞానంలో పరిసమాప్తం అవుతాయన్నది - భగవద్గీత. కనుక వైకుంఠ ఏకాదశీ వ్రతంలోనూ ఆధ్యాత్మిక నిధి విధిగా ఉంటుంది. యథాశక్తిగా ఏకాదశీ అంతర్గత తాత్త్వికానందరసాన్ని ఆస్వాదిస్తాం.

'వైకుంఠ ఏకాదశి'లో వైకుంఠ, ఏకాదశి అని రెండు పదా లున్నాయి. 'వైకుంఠ' శబ్దం అకారాంత పుంలింగం. ఇది విష్ణువునూ, విష్ణువుండే స్థానాన్నీకూడా సూచిస్తుంది. చాక్షుషమన్వంతరంలో 'వికుంఠ' అనే ఆమెనుండి అవతరించినందున విష్ణువు "వైకుంఠః" (వైకుంఠుడు) అయ్యాడు. మరియు జీవులకు నియంత, జీవులకు సాక్షి, భూతముల స్వేచ్ఛావిహారాన్ని అణచేవాడు - అనీ అర్థా లున్నాయి. వైకుంఠము - అయినపుడు శ్వేతద్వీపమైన విష్ణుదేవుని స్థానం. పునరావృత్తి లేనిదీ, శాశ్వతమైనదీ అగు విష్ణుదేవుని పరమధామం. జీవులు వైకుంఠుణ్ణి అర్చించి, ఉపాసించి, వైకుంఠాన్ని చేరుటే ముక్తి.

ఇంద్రియాలు ఇంద్రియాధిష్ఠాన నారాయణుణ్ణి సేవించుటే భక్తికదా!

"మనః షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి" అనిన గీతావాక్యానుసారం మనస్సూ, పదియింద్రియాలూ అనగా మొత్తం పదకొండు ఇంద్రియాలను శబ్దాది విషయాల ద్వారా జీవాత్మ ఆకర్షిస్తుంది. అంటే జీవాత్మ శరీరాన్ని వదలి వెళ్లేటప్పుడు కర్మేంద్రియాలను, ప్రాణాలను, బుద్ధిని కూడా తనతో తీసుకొని పోతుంది. జీవాత్మ ఒకశరీరం నుండి మరొక శరీరంలో ప్రవేశించేటప్పుడు మొదటి శరీరంనుండి మనస్సుతోపాటు ఇంద్రియాలనూ ఆకర్షించి, తీసుకవెళ్తుంది. మన స్సంటే అంతఃకరణం.

ఇట వైకుంఠ మంటే పరంధామం. ఏకాదశి అంటే పదకొండు ఇంద్రియాల సమూహం. (5 కర్మేంద్రియాలు, 5 జ్ఞానేంద్రియాలు, 1 మనస్సు=11 ఇంద్రియాలు. మనస్సుకూడ ఒక ఇంద్రియమే!) ఈ 11 ఇంద్రియాలూ వైకుంఠునికి అర్పింప బడి, వైకుంఠుణ్ణి అర్చించి, సేవించి,

ఉపాసించినపుడే - అవి పవిత్రములై వాటిద్వారా సుఖానుభూతి నొందే జీవుణ్ణి వైకుంఠంలో చేరుస్తాయి. కాగా "ఏకాదశేంద్రియాలను వైకుంఠార్పణం చేసి, వైకుంఠాన్ని చేరి, శాశ్వత ముక్తినొంది, ధన్యులు కాండి" - అని బోధిస్తుంది - "వైకుంఠ ఏకాదశి". వికుంఠ మంటే - దెబ్బ తిననిది. ఇంద్రియాలు "వికుంఠాలు" అయినపుడే వైకుంఠసమర్చన ప్రశాంతంగా జరుగుతుంది. ద్వాదశి - 12వ స్థితి. ఇదే ఇంద్రియాతీతదివ్యానంద స్థితి! ఏకాదశినాటి ఉపవాసం సత్త్వగుణానికి సంకేతం! ఒక వస్తువుకు మిక్కిలి దగ్గరగా మరొక వస్తువు నుంచినపుడు మొదటి వస్తువు యొక్క గుణం, వాసన రెండవదానిపై ప్రభావం చూపుతాయి కదా! అట్లే ఏకాదశేంద్రియాలతోకూడి జీవాత్మ, వైకుంఠునికి - ఉప = సమీపంలో, వాసః=నివసించుటవల్ల అత్యంత సామీప్యసాన్నిధ్య ప్రభావం కారణంగా జీవాత్మపై పరమాత్మ ప్రభావం ప్రసరిస్తుంది. జీవుడు శుద్ధు డవుతాడు. ద్వాదశినాడు చక్రస్నానం గావించి, స్వామి ప్రసాదాన్ని

స్వీకరించడంతో ద్వాదశాక్షరీమంత్రమయమైన వాసుదేవ తత్త్వాన్ని అనుభవిస్తాడు - జీవాత్మ. ఈ అనుభవమే కలియుగ వైకుంఠమైన తిరుమల - శ్రీపుష్కరిణి ముక్కోటి ఏకాదశీ చక్రస్నానఫలం!

ఇది ధనుర్మాసం! "ప్రణవో ధనుః" అనుటచే ఓంకారమే ధనుస్సు. శ్రీవారిని ప్రణవమూర్తిగా ఉపాసించుటే ధనుర్మాస పూజ. అందు 'వైకుంఠ ఏకాదశి' సర్వ సమర్పణ రూపమైన త్యాగానికీ, శుద్ధ సత్త్వగుణానికీ సంకేతం. స్వామి 'పవిత్రాణాం పవిత్రం, మంగళానాం మంగళం' కదా! అట్టి సుదర్శనరూపుని చేతిదివ్యాయుధం సుదర్శనచక్రం. ఇది కాలచక్రానికీ, దర్శనమాత్ర ముక్తిదాయకత్వానికీ ప్రతీక. సుదర్శనచక్ర స్నాన స్పర్శతో కూడిన జలంలో (పుష్కరిణీ తీర్థంలో) స్నానం చేయడంతో జీవాత్మలు పరిశుద్ధులూ, 'సుదర్శనులూ' అవుతారు. ఇట్టి జీవులకు వైకుంఠ ద్వారాలు - ఒక రోజే కాదు - సర్వదా తెరువబడే వుంటాయి.

ఇంతటి ప్రభావసంపన్నమైన వైకుంఠ ఏకాదశినీ, ద్వాదశినీ భక్తిశ్రద్ధలతో ఆచరించినవారికి పునర్జన్మ ఉండదు.

## తిరుమలలో వైకుంఠ ఏకాదశి, ద్వాదశి

కలియుగవైకుంఠమైన తిరుమల - శ్రీవారి ఆలయంలో వైకుంఠ ఏకాదశి మహావైభవంగా నిర్వహింప బడుతుంది. ఈ ఏకాదశికి ముందురోజు అనగా దశమినాటి రాత్రి ఏకాంత సేవానంతరం బంగారు వాకిళ్లు మూసివేస్తారు. పిదప తెల్లవారుజామున వైకుంఠ ఏకాదశినాడు సుప్రభాతం మొదలుకొన్ని, మరునాడు ద్వాదశి రాత్రి ఏకాంతసేవ వరకూ శ్రీవారి గర్భాలయానికి అనుకొనియున్న ముక్కోటి ప్రదక్షిణ మార్గాన్ని తెరచివుంచు తారు. ఈ ఏకాదశీ, ద్వాదశీ రెండురోజులూ శ్రీవారి దర్శనానంతరం భక్తులు ముక్కోటిప్రదక్షిణమార్గంలో వెళ్తారు. ఈ ముక్కోటి ప్రదక్షిణ ప్రవేశద్వారాన్ని వైకుంఠ ద్వార మనీ, ఆ మార్గాన్ని వైకుంఠప్రదక్షిణ మనీ అంటారు.

వైకుంఠ ఏకాదశీ పర్వదినంనాడు ముక్కోటి ప్రదక్షిణ మార్గం రంగురంగుల విద్యుద్దీపాలతో, పూలమాలలతో మనోహరంగా అలంకరింపబడుతుంది. శ్రీ స్వామివారికి అత్యంతసమీపంలో వున్న ఈ ప్రదక్షిణమార్గంలో దర్శనానంతరం వెళ్లిన భక్తులు ఒకవిశిష్ట ఆశ్చర్య దివ్యానుభూతిని అనుభవిస్తారు.

## వైకుంఠ ద్వాదశి

వైకుంఠ ఏకాదశి మరునాడు-ద్వాదశి. ఆరోజు సూర్యోదయవేళ "శ్రీస్వామిపుష్కరిణీతీర్థకోటి" జరుగుతుంది. వైకుంఠ ఏకాదశినాడు ముల్లోకాల్లో వున్న 3 కోట్ల 50 లక్షల పుణ్యతీర్థాలూ, పుష్కరిణులూ తిరుమలలోని 'శ్రీస్వామిపుష్కరిణి'లో దివ్యసూక్ష్మ రూపంతో లీనమై వుంటాయి. అందే సర్వదేవతలూ సన్నిధి చేసి వుంటారు. కనుక ఈ పర్వదినంలో శ్రీవారి ఆలయంలో శ్రీవారికి సుప్రభాతం, తోమాలసేవ, అర్చన,

నివేదనాదులు యథాక్రమంగా జరుగుతాయి. పిదప ఆనందనిలయంలో వున్న "సుదర్శన చక్రత్తాళ్వార్" పల్లకిని అధిరోహించి, ఊరేగింపుగా తిరుమల తిరువీథుల్లో మహాప్రదక్షిణంగా వచ్చి, శ్రీవరాహస్వామి ఆలయ ప్రాంగణం చేరుకొంటారు. అక్కడ 'చక్రత్తాళ్వార్'కు అభిషేకం జరిగిన తర్వాత పుష్కరిణిలో పవిత్రస్నానం చేయిస్తారు. ఇలా చక్రస్నానం జరిగే సమయంలో అసంఖ్యాకభక్తులుకూడా పుష్కరిణిలో మునిగి పవిత్రస్నానం చేస్తారు. పిదప చక్రత్తాళ్వార్‌కు వస్త్రాలంకారం, నివేదన, హారతులు ఘనంగా నిర్వహిస్తారు. అటనుండి చక్రత్తాళ్వార్ వారు (సుదర్శన భగవానులు) బయలు దేరి, ప్రదక్షిణంగా వేంచేసి, శ్రీవారి ఆలయాన్ని ప్రవేశిస్తారు.

తిరుమలలో స్వామిపుష్కరిణిలో సంవత్సరంలో నాల్గుమార్లు చక్రస్నానం జరుగుతుంది. 1) భాద్రపద శుద్ధ చతుర్దశి - అనంతపద్మనాభవ్రతంనాడు, 2) 10 రోజులు జరిగే బ్రహ్మోత్సవాలలో చివరి రోజు, 3) వైకుంఠ

ఏకాదశిమరునాడు - ద్వాదశినాటి ఉదయం, 4) రథసప్తమినాటి మధ్యాహ్నం.

ఈ నాల్గింటిలో వైకుంఠద్వాదశి నాటి ఉదయం జరిగే చక్రస్నానంలో భక్తులు అసంఖ్యాకంగా పాల్గొంటారు.

## విశేష పూజాదులు

వైకుంఠ ఏకాదశినాడు ఉభయనాంచారుల్తో మలయప్పస్వామి సర్వాలంకారభూషితుడై తిరువీథుల్లో స్వర్ణరథంపై ఊరేగుతారు. ఆనాడు శ్రీవారిసన్నిధిలో "రాపత్తుతొడక్కం" జరిగి, శ్రీనమ్మాళ్వార్‌వారు సాయించిన "భగవద్విషయం" అనే అపరనామధేయాంకమైన "తిరువాయ్‌మొళి" అనే దివ్యప్రబంధంలోని నాల్గవ ఆయిరం అధ్యయనం ప్రారంభిస్తారు. వైకుంఠద్వారం ద్వారా ఈనాడు వేలకొలది భక్తులు శ్రీస్వామి వారిని దర్శిస్తున్నందున ఈ ఉత్సవాన్ని "వైకుంఠ ద్వారస్థ భగవదాలోకనమహోత్సవం"గా కీర్తిస్తున్నారు.

ద్వాదశినాటి చక్రస్నానంతో తామూ స్నానంచేసి, భక్తులు వైకుంఠ ఏకాదశీవ్రతఫలాన్ని పరిపూర్ణంగా పొందు చున్నారు.

(తిరుమలలో వైకుంఠ ఏకాదశి, ద్వాదశి విశేషాలు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యంగారు రచించిన "శ్రీనివాస వైభవం" నుండి గ్రహింపబడినవి. వారికి కృతజ్ఞతాంజలులు.)

"సదా వేంకటేశం స్మరామి స్మరామి"

॥ ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥



